# గాయాలు

(కవితా సంపుటి)



గొడుగుచింత గోవిందయ్య



వెన్నెల సూర్య ప్రచురణ
దామల చెరువు
చిత్తూరు జిల్లా

గాయాలు (కవితా సంపుటి)

గొడుగుచింత గోవిందయ్య

వెన్నెల సూర్య ప్రచురణ

కాలం : 2002

ముఖచిత్రం : ఏలే లక్ష్మణ్

కాపీలు: 1000

వెల : 30/-

కాపీలకు :

1. జి.సుబ్బయ్య, గౌతం నిలయం, రఘునాధ్ నగర్, పోస్ట్: దామల చెరువు, జిల్లా: చిత్తూరు-517152.
2. విశాలాంధ్ర బుక్ హవుజ్ (అన్ని బ్రాంచీలు)
3. మణి బుక్ స్టాల్, సండే మార్కెటు, నెల్లూరు.
4. మైత్రీ బుక్ హవుజ్, మసీదు వీధి, ఏలూరు రోడ్, విజయవాడ .

---

కంపోజింగ్ : మిత్రహాస్ కంప్యూటర్స్

ముద్రణ : రోషన్ ప్రింటర్స్, నల్లకుంట

# అంకితం



అడివెక్కి... బోదగోసి,
రైతుకూలి పనులు జేసి,
పగలనక, రాత్రనక —
గూడలేసి, కపిలిదోలి
వారపు సేద్యంలో ఎపుడూ...
చమట్లు చిందించి
బిడ్డల సదువు, ఉన్నతికై
కాలం- కాయం ఖర్చుచేసిన
మా అమ్మా, నాయిన
**పద్మమ్మ-ముత్యాలయ్యలను**
తలుస్తూ...

ఈ గాయాలు

**సమర్పణ-**

# స్మృత్యంజలి



చదువే... జీవితంగా
జీవితమే అక్షరాల రాశిగా ఎదిగి,
భారత రక్షణకై సైనికుల ఎంపికలో
విధి నిర్వహణలో విరామమెరుగక
అకాల మరణంతో శవ పేటిక చేరిన

తమ్ముడా! సైంటిస్టు రఘునాథా!
నా ఎద గాయాలు నిను ఎతుకుతున్నాయి
నీ జ్ఞాపకాల చిత్రమాలికల రాశిలో
నీ ఆశయ సాధనకై నడుస్తూ ...
నీ నడకల మాటల చూపుల స్మరిస్తూ

మీ... అన్న
**గోవిందయ్య**

# వర్తమాన కవి గోవిందయ్య

గోవిందయ్య వర్తమాన సామాజికకవి. సున్నిత వ్యక్తిత్వం గల గోవిందయ్య ఈనాటి సామాజిక సమస్యలన్నిటికీ స్పందించాడు. ఆ స్పందనలను ఎదగాయాలుగా కవిత్వీకరించాడు. ప్రపంచీకరణ ఫలితమైన రైతుల ఆత్మహత్యల నుంచీ పోలీసు కస్టడీలో హత్యల వరకూ సవాలక్ష సమస్యలు మనచుట్టు ఉన్న సామాజిక సమస్యలే గోవిందయ్య కవితల్లో వస్తువు. భూస్వామ్యవిధానంతో బాటు సామ్రాజ్యవాద దోపిడి. భారతీయ రైతాంగాన్ని అణిచివేస్తున్న విషాదాన్ని గోవిందయ్య ఎన్నో కోణాలనుంచీ రక్తగానం చేసాడు. దేశం వెన్నెముక విరుగుతున్న శబ్దాల్ని రికార్డు చేసాడు. ఆకాశంలో సగం అనే భారతనారి అంతర్జాతీయ మహిళాలోకానికి మార్గదర్శి అనే చిలుకపలుకులు పలుకుతూ సమాజంలో స్త్రీలపై జరుగుతున్న సర్వ అణిచివేతనీ తీవ్రంగా నిరసించాడు. మతోన్మాద కుల తత్వ శక్తులు ప్రజాస్వామ్యాన్ని అపహాస్యం చేస్తున్న వైనాన్ని ఎండకట్టాడు. దళితుల మీద మైనారిటీల మీదా అమలవుతున్న సాంఘిక సామ్రాజ్యవాదాన్ని బట్టబయలు చేసాడు.

గోవిందయ్య వివిధరకాల బాధితుల పట్ల నిబద్ధత ఉన్న కవి. ఇదే ఈ నాటి కవికి ఉండవలసిన లక్ష్యం. సమాజంలో వివిధ సామాజిక బృందాలు, వర్గాలూ, వృత్తికారులూ ఎన్నిం కాల సమస్యల సుడిగుండంలో శలభాలుగా మాడిపోతున్నారో గోవిందయ్య గుండె గాయాల కవిత్వంలో ఆలపించాడు. పీడిత ప్రజాశ్రేణుల బాధామయ జీవితాల్ని చూసి గోవిందయ్య స్పందించటమే కాదు, గాయ పడ్డాడు. ఆ గాయాలకి వస్తున్న ప్రతిఘటన- ఆ ప్రతిఘటనలు ఉద్యమాల రూపం పొందటం కూడా గోవిందయ్యకు తెలుసు. సమాజాన్ని నిరంతరం దారుణంగా వేదిస్తున్న అసంఖ్యాక సమస్యలు తెలిసిన గోవిందయ్య ఆ సమస్యలకి మూలమైన సామాజిక ఆర్థిక వ్యవస్థని ఇంకా స్పష్టంగా నిక్కచ్చిగా అర్థం చేసుకోవాలి. తాత్త్విక గందరగోళం సమస్యల పరిష్కారాన్ని దర్శించనివ్వదు. మార్క్స్, లెనిన్, మావో, అంబేద్కర్ల పట్ల గౌరవభావం ఉన్న గోవిందయ్య సమస్యల పట్ల అవగాహనలో ఇంకాపరిపక్వత సాధించటం కష్టం కాదు. కలగాపులగపు భావాలు చైతన్యాన్ని నీరుగారుస్తాయి. ఈనాటి కవికి సమస్యల మూలాల విశ్లేషణ కూడా తెలియాలి. గోవిందయ్య విద్యాధికుడు. ప్రాచీన, ఆధునిక సాహిత్యాల్ని సంవత్సరాల తరబడి అధ్యయనం చేసాడు. అయినా భాషలో భావప్రతిమల్లో ఆర్భాటం చెయ్యక పోవటం విశేషం కానీ హద్దులు లేని నిరాడంబరత కవిత్వాన్ని నీరసం చేస్తుంది. సమత మమతలతో నిండిన సహజీవన సమసమాజాన్ని కోరుతున్న గోవిందయ్యకి ప్రగతిశీల కవిత్వ శిబిరంలోకి స్వాగతం. సుస్వాగతం.

త్రిపురనేని మధుసూదనరావు

తిరుపతి

# 'గుమ్మడి గింజంత ఘోరాల్లో సాసవగింజంత పోరు' దారిలోని గాయాలు.

గాయాలు మిత్రుడు గోవిందయ్య తొలి కవితాసంపుటి. గత పదేళ్లలో తన హృదయాన్ని గాయపరచిన సందర్భాల్లో రాసిన కవితలే ఇవి.

బెనారస్ హిందూ విశ్వవిద్యాలయంలో 'తెలుగు సాహిత్యం - వర్ణవ్యవస్థ వ్యతిరేక ఉద్యమాలు' అనే విషయంపై పరిశోధన చేస్తున్నప్పుడు తనను డిస్టర్బ్ చేసిన ఘటనలపై ఏదో ఒకటి రాసేవాడు నాలాటి ఒకరిద్దరు మిత్రులకు విన్పించేవాడు వాటిని ప్రచురించాలనిగానీ, 'చెక్కుడు పని' మీద దృష్టిపెట్టాలనే ధ్యాసగాని లేనివాడు తర్వాత వాటి సంగతే మర్చిపోయేవాడు లేకుంటే ఈనాటి కవిలోకానికి ఏదో ఒక 'ముద్ర' వున్న పాతకాపుగా గుర్తుండేవాడు గోవిందయ్య ఇన్నాళ్లకు మళ్లీ ఇప్పుడు తన కవితల్ని అచ్చువేయ సంకల్పించాడు

చిత్తూరుజిల్లా, దామల్ చెరువు (కుక్కల పల్లి) లో దళిత, పేద రైతు కుటుంబంలో కళ్ళు తెరచిన గోవిందయ్య పరిసరాలను అవగాహన చేసుకుంటూ జీవితాన్ని ఆకళించుకున్నాడు. చుట్టు పరిస్థితుల్ని చదువుకున్నాడు తనకిష్టమైన తెలుగు సాహిత్యంలో ఎమ్ ఏ పూర్తిచేశాడు తన అభిమానకవులు గురజాడ, జాషువా, శ్రీశ్రీల నుండీ, సమాజంలో సాగుతున్న ఉద్యమాలనుండి ప్రేరణ పొందాడు దాదాపు రెండుదశాబ్దాలకు ముందే ఎందరి సూటిపోటి మాటల్నో ఎదుర్కొని పై అంశంపై పరిశోధన సాగించాడు. ఇప్పుడు గిరిజన గురుకుల పాఠశాలలో తెలుగును బోధిస్తున్నాడు

వినయం, నెమ్మదీ, దృఢత్వం, సున్నితత్వం కవి వ్యక్తిత్వ ప్రత్యేకతలు ఎలాంటి అనుకూలించని పరిస్థితినైనా వినయంతో, నెమ్మదిగా deal చేస్తూ, సాగనపుడు దృఢత్వాన్ని వెలికి తీస్తాడు వీటిలో ఇమడందల్లా ఒకటే అది సున్నితత్వం అది కవిత్వకారణం-కవి కంట్లో కనిపించని అశ్రువు ఇది

బలహీన వర్గ, దళిత, గిరిజనులపై, ఆ వర్గాల స్త్రీలపై పోలీసు యంత్రాంగపు కండకావరాన్ని, అగ్రకులాల దాడుల అమానుషాన్ని చిత్రించాడు దాడిచేసిన వాళ్ళపట్ల, న్యాయస్థానాల నిస్సహాయత్వం పట్ల ఆగ్రహించాడు మతోన్మాదం చేసే విలువల విధ్వంసం, మారణహోమాల్ని నిరసించాడు కవి ఇన్నేళ్ల స్వాతంత్ర్యదేశంలో భూమి ఉన్నోడికి ఉంపుడుగత్తె అయి, లేనోడికి వట్టిపోయిన గొడ్డయిన చందాన్ని తెల్పుకున్నాడు 'అసమానతల రుజాహేళి' గా సమాజం మారిపోయిందన్నాడు ఇవన్నీ సామ్యవాద గతిని ఆలస్యం చేస్తున్నాయంటాడు

నేటి 'ప్రపంచీకరణ' సందర్భంలో తలత్తే వివిధ రంగాల వినాశనాన్ని విశ్లేషించాడు రైతుల ఆత్మహత్యల్ని, పెట్రేగి పోతున్న అవినీతినీ, నూనె లేని ప్రమిదౌతున్న సాదామనిషి జీవితాన్ని ఆర్తితో చిత్రించాడు గిరిజన బాల్యాన్ని గీపెట్టి ఏడ్పిస్తూ అమ్ముకుంటున్న 'స్వచ్ఛంద సంస్థల' ముసుగు చించాడు ఇలా నేటి సమాజంలోని ఘటనలే కవికి ప్రేరణలు

కవి పాటల్లోని భావవ్యక్తీకరణలో వున్న పదును కవితల్లో కన్పించదు శ్రీశ్రీ ప్రభావం నుండి విడివడి వచన కవితారూపాన్ని సాధన చేయాల్సివుంది మిత్రుడు గోగో! తన అవగాహనను పెంచుకొని, దృక్పథాన్ని నిశితం చేసుకోవాలనే కోరికతో ---

ఈ కవి హృదయంపై లోకం చేసిన గాయాల్ని కన్నీటితో స్పృశిద్దాం రండి!

డా|| కె. ముత్యం
హైదరాబాద్

# కృతజ్ఞతలు

పురిటి బిడ్డగనే చావుకు చేరువైన నన్ను, తల్లడిల్లుతూ తన చల్లని ఒడిలో భద్రంజేసి తనకు తెలిసిన "దేశీయ వైద్యం"తో నన్ను బతికించుకొన్న 'అమ్మ', మా పెద్దమ్మ జ్ఞానమ్మనూ,

గోపాల బాలుడమ్మా .. ఈ బిడ్డగోపియవతారుడమ్మా... అని పాడుతూ నను ఊయలలూపిన మా మేనత్త కీ. శే. మంగత్తనూ, కుటుంబ వ్యవహారాల్లో తనలోకి నను చేర్చుకొని నా మాటలపై గురి వుంచి, లోకం గుట్టువిడమర్చిన మాపెదనాయిన కీ.శే.చెంగయ్యనూ, నడివీధిలో, వెన్నెట్లో అలసిన కూలి జనాలతో భజనలు వేస్తూ వేయిస్తూ, వాళ్ళ అలసట తీర్చే భజనన్నగా మా పల్లెచే పిలువబడిన పెదనాయిన కీ.శే.వెంకటస్వామినీ, చిన్నమ్మత్తనూ తలుచుకొంటున్నాను.

బాయి పని, రోడ్డుపని, రైతు కూలీ పనుల, మామిడికాయల మండీల్లో తోటికూలీగా... నన్ను జత చేర్చుకొని, పల్లెపదాల, మాటలపాటలతో, అలుపెరగనియ్యక, సరస-హాస్య సంగమంలో నా శ్రమను మరిపించిన మాపల్లె వాసులందరికీ!

ఎందరెందరికో చేయూతనిచ్చి బతుకు దీపాలు వెలిగించిన మహోన్నతులు, నా జీవిత నౌకకు చుక్కానై నడకలు నేర్పిన అనురాగసముద్రుడు, నా కవితలు పరిశీలించి ప్రోత్సాహపు పుష్టినిచ్చిన మా..సంద్రం భాస్కరన్నగారికి! వాత్సల్యం కురిపించే వదిన నాగేశ్వరమ్మగారికి!

నా కవితా తీవెల అల్లికకు పందిరై, నా గతి ప్రగతికి తోడై, ఈ కవితా సేద్యానికి స్వాతిచినుకులై ముందుకు నడిపిస్తున్న నా జీవిత దిక్సూచి శ్రీ పాటూరు దశరాం మామగారికి! నా ఉన్నతిని కాంక్షించే చెల్లెలు లక్ష్మమ్మకు! ఎప్పుడు వెళ్ళినా 'బువ్వ తినబ్బా ...' అంటూ కడుపు నింపే ఆప్యాయతా పరిపూర్ణిత, మా వదిన డా. సంపూర్ణమ్మగారికీ ! అలసటెరుగని కష్టజీవులు సుబ్బక్క, వెంకటేసు మామలకు !

మా నాయిన సావాసి, నాచే ఓనమాలు దిద్దించిన తొలిగురువు శ్రీ సుబ్రమణ్యం పిళ్ళైగారికి!

సాహిత్యాన్ని నా ధ్యాసగా చేసిన మలిగురువు ప్రఖ్యాత తెలుగు కథకులు కీ.శే.మధురాంతకం రాజారాం గారికి !

కవితా తీపిరుచి చూపిన కీ.శే. డి.నాగశిద్దారెడ్డిగారికి ! కీ. శే. పూడి

వెంకట్రామయ్య, కవితా ఎత్తుగడ నేర్పిన శ్రీ శ్రీనివాసమూర్తి గారికి !

బెనారస్ హిందూ విశ్వవిద్యాలయం లో పరిశోధక విద్యార్థిగా నన్ను ఆదరించి, ఆప్యాయతలు పంచిన ఆచార్యులు కీ.శే బయ్యా రత్నావళిగారికి! కీ. శే. బయ్యా సూర్యనారాయణ గారికి !

కవితలు పరిశీలించమని కోరినపుడు బాగున్నాయి, గాయాలు పేరు బాగుంది... పుస్తకంగా ముద్రించమంటూ, నాలో అంకురించిన చిరు ఆశయానికి ప్రోత్సాహపు పరిచయాక్షరాలు రాసిన గురువు, ప్రముఖ విమర్శకులు, శ్రీ త్రిపురనేని మధుసూదనరావుగారికి!

స్నేహానికి నిలయం మిత్రులు ముత్యం. రచయితగా, విమర్శకుడిగా, పరిశోధకుడిగా, సాహిత్యశిఖరాల నధిరోహిస్తున్నారు. నా కవితలు పరిశీలించి, మెరుగైన సూచనలతో ముద్రణకు ప్రోత్సహించారు. నా **గాయాలు** పరిచయం చేయడమేగాక, సకాలంలో పుస్తక రూపంలో రావటానికి ఎంతో సమయాన్ని వెచ్చించి, కృషిచేసిన డా.కె. ముత్యం గారికి!

నన్ను అభిమానించే నా విద్యార్థులకు, సహ ఉపాధ్యాయమిత్రులకు ! ఎం వెంకటేశ్వర్లు, ఎం.ఎస్. ఆనందబాబు, పి. ప్రసాద్ మరియు కీ.శే. శ్రీనివాసమూర్తిలకు! కవిగా అనేక చోట్ల పరిచయం చేసిన శ్రీ టి.రాజగోపాల్ గారికి!

ఇంపుగా పలకరించే మా సుబ్బన్న, నందనారన్న, చిన్నన్నలకు! కవితాభిమానులు, ఎం.శేషయ్య, ఎల్. రామయ్యమామలకు, కె. మునిక్రిష్ణయ్య, టి. రాజగోపాల్, ఎస్. గంగయ్య గార్లకు! అభిమానించి రఘు, రామయ్య, క్రిష్ణయ్య, శివశంకర్ లకు!

నన్ను తరచుగా **గాయాలమయం** చేస్తూ .. ఈ రచనకు ప్రేరణ అందించిన నా సహజీవని, సహనగుణశీలి, ఈశ్వరికీ !

తన విలువైన కాలాన్ని వెచ్చించి, శ్రమకోర్చి ఈ సంపుటిని ముద్రించి పెట్టిన ఆప్తమిత్రులు, యువ చరిత్రకారులు డ్చాక్టర్ టి.విజయకుమార్ (హైదారాబాద్) గారికి! కవితలు ముచ్చటగా టైపులో పొందుపరచిన శ్రీమతి పద్మావిజయకుమార్ గారికి !

ముఖ చిత్రం గీసిన ప్రముఖ చిత్రకారులు, మిత్రులు ఏలె లక్ష్మణ్ గారికి

ఈ సంపుటి ఇలా రావడానికి కారణమైన వారందరికీ ....

**కృతజ్ఞతలు.**

గొడుగుచింత గోవిందయ్య

# భూమిపోరు

విశాలమైన భరత భూమిరా...
ప్రగతివైపు వడిచే సోదరా!
మేధావుల ఖ్యాతి తోడ విలసిల్లిన భూమిరా!
తాత్వికులకు నిలయమైన భూమిరా మనభారతం
దాన-జ్ఞాన-గుణవంతుల కన్నభూమి మనదేరా!
మానవతను నిలుపుటకై మనీషుల గన్నభూమి

ఉద్యమమే ఊపిరిగా సాగిన దేశం
స్వాతంత్ర్యం సాధించినదీ వేడుక తోడుగ
సాధ్యమయ్యే స్వాతంత్ర్యం ప్రజాస్వామ్యం తోడుగ
స్వతంత్రభూమి భరత భూమిరా!
మరి భూమి లేని జనం చూడరా!
ఇది భూస్వాములు ఏలే భూమిరా!
బానిసైంది భూమి చూడరా!
భావినేత నీవే కావరా...
సమత పంచగ ముందు నడవరా!
మంచిని పెంచే మమత నిలుపరా!
భూమిపోరు చేయలేవరా!

14-8-91

ములుగు.

# స్త్రీ

వివస్త్ర కాబడి
వీధుల్లో ఊరేగింపబడుతోంది స్త్రీ..
ఇంటరాగేషన్ పేర
చిత్రహింసలకు గురై
రక్షకభట నిలయాల్లో
ఖాకీ కామ భీకర కౌగిళ్ళలో నలిగి
సామూహిక మానభంగాల తో
నేడూ...బలౌతున్నది స్త్రీ.

మహానగరం నడిబొడ్డులో
మతకల్లోలాల్లో...... మత రక్కసి విషపు గాట్లకూ...
గురవుతున్నది....స్త్రీ.
వసతి గృహాల్లో
నయాన్నో, భయాన్నో, తెలియకో, తెలిసో...
వంచన కాబడుతున్నది స్త్రీ

వాడలపైబడి, అమానుషంగా
సామూహిక అఘాయిత్యాలు జరుగుతుంటే
బలౌతున్నదీ....స్త్రీ.
ఇది ఈదేశపు మేధావులకీ
పాలక వర్గాలకు-పార్టీలకు
రక్షకభట దళాధిపతులకు తెలుసు.
ఇంతటి నాగరిక హిందూదేశం లో
సభ్యసమాజంలో జీవనం సాగించినా
ఆ స్త్రీ అధికార- ఆధిక్యతలకు ఆహుతై
సమిధలా బలికాబడుతూనే వుంది
వాళ్ళ ఆర్తనాదాలు అనంత వాయువుల్లో

గొడుగుచింత గోవిందయ్య

కలిసి-సమిసిపోతూనే... వున్నాయి.
నిలకడలేని న్యాయమూర్తులతో
నిజాన్ని చూడలేని రక్షకాధిపతులతో

కోర్టులకు కొదవ లేనేలేదు
రక్షకభట నిలయాలు నిండుకున్నాయి
నిజాన్ని నిక్కచ్చిగా సాక్ష్యం చెప్పినా ...
బలౌతున్నవారికి రక్షణా లేదు
'బలి' చేస్తున్నవారికి శిక్షాలేదు-

ఆ స్త్రీ ఓ బలహీన వర్గపు స్త్రీ
ఆ స్త్రీ ఓ దళిత వర్గపు స్త్రీ
ఆ స్త్రీది పేదవర్గం కావడమేగదా !?!

ఎందరి హృదయాలలోకెళ్ళాయి
ఆ ఘోష, ఆవేదన, ఆక్రందనలు
ఎందరి ఎదల్ని తాకాయి ?
ఆ బలహీన-దళిత-పేదవర్గ స్త్రీలకై
ఎందరు బిగించారు పిడికిలి ?

## సింధువులు

నా జీవన
పోరాట- ఆరాటంలో
కరిగి...కదులుతున్న...
కన్నీటి బిందువులే
నా...సింధువులు

# చావుల చరిత

స్వాతంత్ర్యపు భరత భూమి
స్వర్ణ భారతమై నిలిచిన భూమి

సమభావన తోడుగా మానవతను పంచగా
స్వతంత్రను వెదజల్లెను నలుదిశలా
సకల జీవనదులు–సాగు భూమిరా
మరి తాగు నీళ్ళ తగవు చూడరా!

సువిశాల భూమి నీదిరా...
అందుసాగు చేయ నీరు లేదురా...
అన్నపూర్ణ భూమి మనదిరా
ఆకలి చావులేన్నో లెక్కచూడరా!
స్వాతంత్ర్యపు చరిత చూడరా
స్వేచ్ఛకోరే చావులెన్నిరా!
దమనకాండ నీతి చూడరా
ఆ ఊచకోతల కదిపిచూడరా!

---

*గొడుగుచింత గోవిందయ్య*

# భారత రత్నం

(తిరుమల మందిర సుందరా... పాట వరుస)

భారత మాతా భూషణా!
నిరుపేదల జీవన పెన్నిధీ..
నీ రూపము తలిచే భాగ్యము
మా కొసగిన కరుణామూర్తివే ... //భారత//

విశ్వమంతలో విజ్ఞాన నిధివై
వెలిగిన దివ్యమూర్తీవే...
రాజ్యాంగముతో భారత జాతికే
పాలన జూపిన పావనమూర్తివే ... //భారత//

ఆశయాలను నిండుగనిలలో
నిలిపేయత్నమే మా జీవనము
కలకాలం మిము తలచుటకన్నా.
అన్యమైనది లేదులే... //భారత//

ఐక్యముతో మేమొకటిగ నిలిచి
సమతా భావపు మమతలతో...
ప్రగతి పథముల దళిత జాతిని
వికసింప జేయగ నిలిచెదమూ... //భారత//

*(డాక్టర్ అంబేద్కర్ కోసం)*

★ శ్రీ సి. రాములు గారు జాయింటు డైరక్టర్, సాంఘిక సంక్షేమ శాఖ, హైదరాబాదువారి చాంబర్‌లో పాడితే అభినందనలతో కౌగిలించుకొని ప్రోత్సహించారు.

★ ఆచార్య బయ్యా సూర్యనారాయణ (బెనారస్ హిందూ విశ్వవిద్యాలయం, వారణాసి) గారు ఈ గీతాన్ని హిందిలోకి అనువదించారు.

★B.H.U మాలవ్యభవన్‌లో జరిగిన అంబేద్కర్ జయంతి సభలో అప్పటి వైస్ ఛాన్సలర్ ఇగ్బాల్ నారాయణ్‌గారి అధ్యక్షతన ఈ గీతం ఆలాపించాను. హిందీ అనువాదాన్ని మిత్రుడు అఫ్లాతూన్ దేశాయ్ సభలో చదివారు. అంబేద్కర్ జయంతి సభల్లో ఈ గీతాన్ని పాడటం జరిగింది.

6-2-79

# మధురవాణి

ఎంత చక్కనిదోయి
ఈ తెలుగు భాష
ఎంత మధురమోయి
ఈ తీపి మాట-

ఎంత నాణ్యత గలది
ఈ భాష నడక
ఎంత రమ్యత గలది...
ఈ తెలుగు రూపం

సీమ యాసలో విన్న
తెలంగాణ యాసైన
తీర కోస్తా తెలుగు
ఇంపుగ విందులు గూర్చు

సొగసులు విరిసే స్వరాంత భాషగదా!
సర్వ సరాగాలు కురిసే సుమరాశి గదా!
సుధల రుచిరాజి ఈ తీపి భాష!
గిడుగు-గురజాడల వాడుకల్లో
ముత్యాల సరాల మూటల్లో
దళిత జన పలుకుల్లో
కూలక్కల చెమట పాటల్లో
ఎంత చక్కనిదోయి
ఈ తెలుగు భాష!

# రాపిడి

అసమానతా రాపిడిలో...
అనుక్షణం సామాన్యుడు దోపిడితో
అరిగి నలుగుతున్నాడు
ఈ సువిశాల భారతంలో

కులానికీ- మతానికీ
కర్కశత్వం- మౌఢ్యం
స్థావరపు- వారస్వత్వపు
విషకోరల కాట్లతో
సాధారణ మనిషిని కాటేస్తున్నాయ్-

భూమి కొందరికుంపుడుగత్తె,
భూమి కొందరి ముంజేతి కంకణం
భూమి కొందరికి వెట్టిగత్తె
భూమి కొందరికి వుట్టిగుంది
భూమి మరెందరికో వొట్టిపోయింది.

భూమిలేని అసమానతా రాపిడిలో
అనుక్షణం సామాన్యుడు సమసి పోతున్నాడు.

# దళితన్న ప్రగతి.

ముందుకడుగేయరో దళితన్నా...
నువ్వు ముందుకే సాగరో దళితన్నా!
మనం ముందుకే నడవాలి దళితన్న....
ఆనవాళ్ళున్నాయి చూడన్నా...
జనబలం నీవేరా దళితన్నా!

ఈ నేల నీదిరా... ఏనాటినుండో
నీవు నడవనిదేది? నీవు చేయనిదేది?
ఎన్నెన్నోచేశావు దళితన్నా...
ఆ ఆనవాళ్ళున్నాయి చూడన్నా...

ఆంధ్రదేశానికి అందంగా వున్నట్టి
పూర్ణకలశం శోభ వెలుగొందుచున్నది
పూర్ణకలశం నీదే దళితన్నా...
నీ వాళ్ళ ప్రతిభయే చూడన్నా...

అన్నికార్యాలలో పూర్ణకలశం తోడ
ఆంధ్రులందరు పొందు ఆనందమును చూడు
ఈ నేలలో తొలుత జీవనము నీదన్న
ఈ నేల కోసమై నీమీద బడ్డారు
ఎదిరించి నిలిచింది ఎవరన్నా?
వాళ్ళ జడిపించి నడిచింది నీవన్నా-
వృత్తి పనులుచూపి ఉత్తుత్తి మాటల్తో
మాయ జేశారన్న నాటి మేధావులు
పాలకులు వాళ్ళతో కుమ్మక్కులైరన్న

గొడుగుచింత గోవిందయ్య

సాగింది వాళ్ళకై ఆ పాలనంతాను
కుల అగ్రతనముదే రాజ్యమై పోయింది
బలము కలవాడిదే భోగమై పోయింది
కలిమి కలవాడిదే భాగ్యమై పోయింది
కులము, బలము, కలిమి రాజ్యాల నేలాయి

బండలను పగలేసే బలముంది నీలోన
నైపుణ్యముల జేయు శక్తుంది నీలోన
పరిశోధనా బుద్ధి బావుంది నీలోన
క్రాంతికారుడు నీవే దళితన్నా!
ప్రగతి నీ సొత్తన్నా మాయన్న
అందుకే!

చదువు చదివించన్న నాయన్నా
సంఘటిత పరచన్న వోరన్నా
నడిచి నడిపించన్న దళితన్నా
నీవు నడిపించి నడవన్న మాయన్న!
పూలే పెరియార్ల పట్టుదలను నింపి
డాక్టర్ అంబేద్కరు నాదర్శముగ జేసి
అన్ని దిశలందు నీవుండన్నా
ప్రగతి చెంతకు చేరు మనకన్నా-

# దళిత నేస్తం

ఈ అవస్థల వ్యవస్థలో...
సమభాగ సాధనకై
సమైక్యపోరు సల్ప
మాల మాదిగలనుట విడచి
పాలకుల వంచనల విరచి
సమున్నతంగ ఉద్యమించ
సమైక్య దళిత వెల్లువై లేవండి!

పాలకుల ఉచ్చుల్లో
పావురాళ్లై చిక్కకండి
వంచకుల పంజరాల్లో
చిలకలై పలకకండి
వాళ్ళ వాదాల్ని వేదాల్లా
వల్లించకండి పదేపదే...

వాస్తవ సార మెరిగి
సాగించలెమ్ము! లేమ్ము!
నిరవధిక-నిర్విరామ
సమభాగ సాధనకై
సమభాగ సాధనోద్యమం

దండుగే గదా! దండోరా!
మహానాడు గోల ఏలా?
కవి జాషువా ఆక్రందన
ఆ ఎదగాయపు వేదన
మార్చు మావోల ప్రప్రథం

---

గడుగుచింత గోవిందయ్య

పూలే-పెరియార్ల నిబ్బరం
డాక్టర్ అంబేద్కర్ పోరు తీరు
అవలోకన నేడవసరం

పాదిరికుప్పం-కారం చేడు
నీరుకొండ-కర్లకుంటలపై
సామూహిక బీభత్స దారుణం
దౌర్జన్యదాడి-విధ్వంస మారణ హోమంలో
దళితులు సాధించగలిగిందేముంది?
కంటితుడుపు అరెస్టులు తప్ప
కోర్టుకేసుల కొట్టివేతలు తప్ప

'టీ' కొట్లలో గ్లాసుల రగడసాగింది
కూలి పనులకు రాలేదని ఛీ కొట్టారు
రేపులు చేసి రూపాయలిచ్చారు
గుండుగొరిగి సున్నం బెట్టారు
చెట్టుకు కట్టి సావగొట్టారు
అనేకానేక అఘాయిత్యాల్లో...
కుల-బల-ధన-సంపన్న
ఈ స్వర్ణ భారతీలో
సాధించిందేముంది దళితులు ?

'గుమ్మడికాయంత ఘోరాల్లో
సాసవగింజంత పోరు తప్ప'

11-1-98, నాయుడుపేట - తిరుపతి మధ్య బస్సులో రాసిన కవిత.

# సాహసీ

సమతా ఉద్యమ బాటలో
సాగిన ఓ ...సాహసీ...
భారతదేశ పాలనకై
సంవిధాన మందించిన
భారత రత్నమా! బాబాసాహెబా!
అందుకొనుమా స్వర్ణభారత
సమత సాధన వందనం

సాగుతోంది ఈ నేలపై
అసమానపు విషపుధార వర్షించే
సాంఘిక దురాగతాల పెత్తనం
భూస్వామ్య-అధికార కులాఢ్యుల
ఎద మురికి నేలలో మొలిచింది
అసమానతల రుజాహేల
రేపుల రగడల రేసుల్లో

నీ ఉద్యమ నేపథ్యం
మాకిచ్చెను ప్రగతి పథం
నీ ఆశయ సాధనమే
మా జీవన ధ్యేయంగా
సాగుతాం మేమెల్లరం

అమాంతంగా ఆటవికంగా
కులాధిక్య-అధికార అండతో
మంటబెట్టి సజీవంగా కాల్చారు దళితుల్ని
దుత్తలూరు సామరగడల గ్రామంలో
నిమ్మకు నీరెత్తింది న్యాయం
బొమ్మలా చూస్తూంది చట్టం

7-12-98



గొడుగుచింత గోవిందయ్య

కత్తులతో కుత్తుకలు కోసిన
కల్లోలపు కేసుగదా కారం చేడు
కత్తుల కరాళ చేష్టలను కోర్టుకిస్తే
ఆ...కేసునే కొట్టేసింది
హైకోర్టుకెళ్ళాలా?
సుప్రీమ్ కోర్టు కెళ్లాలా?

అగ్ర వర్ణాలు అధికార అండతో
పాలకుల పట్టుతో బలంతో
దళితుల్ని నరికి రక్తపు మడుగులు చేస్తే
ఆంధ్రాలో అలజడి రేగితే
ఆ కేసును కొట్టివేస్తే...
న్యాయం, ధర్మం ఏమైనాయ్?
ఎవరికి ఊడిగం చేస్తున్నాయ్?

మానవ హక్కులు మంటగలుస్తుంటే
భోగి మంటలై లేవాల్సింది దళితులు
సంక్రాంతి మహా జ్వాలా శిఖలు
కావాల్సింది దళితజనం
అసమాన ఖాండవ దహనం
చేయాల్సింది దళితజనం.
చట్టం, న్యాయం, పాలనా బలం
సాధించాల్సింది దళితజనం

# 'మంది' కోత

దామల్ చెరువు కట్టకింద
కోడికూసే జాము కాడ
కొడవళ్ళు బట్టి కోతకోసే
కూలక్కలారా! అమ్మలారా!

పైట కొంగులు ఎగ్గట్టి
పిక్క బలముల సత్తువల్తో
పిడికిళ్ళవాదులు వేసుకొంటు
వొంగొంగి కోత కోసి
వాదులేసే కూలక్కలారా!
వాదులెత్తె కూలమ్మలారా!
వాదిగొట్టె వాని చెంతన
నడిం పొద్దు ఎండల్లో
తూర్పార బట్టి వొడ్లకుప్పను
జల్లు నుండి వేరు చేసి
గోతాల్లో బోసేటి
చెల్లెలారా! అక్కలారా!

ఈ దేశపు చెరువు కింది
కులతత్వపు మడులు కొన్ని
కల్తీలయి పండినాయి
వర్ణాశ్రమ ధర్మాల తో
సాంప్రదాయపు మడులు కొన్ని
ఆచారపు మడులు కొన్ని
మడులు మడులై పండినాయి
కొడవళ్ళు బట్టి కోత కోయండి

పిడికిళ్ళవాదులు ఏసుకొంటూ
పైటకొంగులు ఎగ్గట్టి
పిక్కబలముల సత్తువల్తో
కరకరాయని కోత కోయండి
వాదిగొట్టి జాషువన్నకు
పూలెయన్నకు-రనడేయన్నకు
పెరియరన్నకు పిడికిళ్ళ నివ్వండి.
మార్క్సన్నకు-మావో అన్నకు
విరసమన్నకు-దరసమన్నకు
వాటంగా అందివ్వండి
వాదులన్ని చెంతజేర్చండి

సాంప్రదాయపు పాతకాలపు
మడుల గింజల రాసులన్ని
తూర్పారబట్టి వేరు చేయండి
ఆ ... బురదలోనే కలిపివేయండి

## అంధుడు

అనేకనేక కారణాల చేత
అడుక్కుతినే గతి పట్టిన
ఓ భిక్షగత్తెను, పిచ్చిగత్తెను
నడిరాత్రి వీధి అరుగుపై
రాక్షసంగా రేప్ చేసిన ఘనుడు
వాడు ధన-మద-కులాంధుడు.

12-3-90

# అధ్వాన్నమ్

ఈ దేశాన్ని అన్యాయం చేస్తున్న
ఓ... అధ్వాన్నపు మనుషుల్లారా!
తరాలు తరించిన రామ జన్మభూమికై
ఆరేడేళ్ళు సాగించిన
ఆ భీకర కరసేవల
యాత్రా జాతర్ల లీల లేమిటి?
మతం మత్తులాంటిదని
మతాభిమానం మదిలో
కరడు గట్టన్వివద్దని
ఎందరనలేదు మేధావులు
ఈ సువిశాల భారతావనిలో!

మతాభిమానం శృతిమించితే
పరమతాన్ని సహించలేమనే
నగ్నసత్యాన్ని కరసేవ పేరుతో
కరాళ నృత్యం చేస్తున్నది హింస
కరసేవకై రగిలే అగ్నిలో
అమాయకంగా, అమాంతంగా
ఆహుతవుట వింటూ, కంటూ...
ఎందుకు నీకింగా కుంటిసాకులు?
మసీదు గుమ్మటాలు కూల్చడం
అధికారంతో అందలమెక్కడమేనా?

చరిత్రలో ఆలయాలు కూల్చిన
మతమౌఢ్యులను నానామాటలన్నాం
కానీ...మనం మత మౌఢ్యుల

# మతం క్రీడలు

మత సహనమ్మని మాటలు మాత్రమే
విధిగా, నిధిగా మిగిలెను మనిషికి
మనిషిని మనిషిగ చూడని వాడే
మతవాదన ఘోషలు పలుకును చూడు

మత మౌఢ్యపు మడిలో
అసమానపు ఘోరాలెన్నో?
మతాభిమానపు మత్తులో
కసిగా తెగిన కుత్తుక లెన్నో?

మతం భూమి భారతం లో
మారణహోమం, దారుణ గాయం
జరగనిదెక్కడ-? తగలనిదెక్కడ?
మతపు మనిషి నేర్చాడు మడి నుడి
మతానికై కావాలంటాడు గుడి
గుడికై వడిగా వడివడిగా...
లయా రహిత నాట్యం చేస్తూ...
శతాబ్దాల నాటి ఆ...ఆటవిక నాట్యమే
నేర్వాలని, నిలవాలని, నెలకొల్పాలని
బంధులు, హాహాకారాల రాస్తారోకోలు,
మతవాదన వేదనలతో...
విలాపాల ఆలాపన చేస్తున్నది
మన భారతం సువిశాల భారతం
తారతమ్యత తరలించలేని భారతం.
మత సహానానికి మరోపేరు భారతం
మతం మనిషికి మసిబూసేతీరు చూడు

మతం ముద్దు బిడ్డల
మారణహోమాల ముచ్చట్లు
దమనకాండల దాగుడు మూతలు
కుత్తుకలు నరికే కోతికొమ్మలాటలు
కక్షలు పెంచే దీక్షల మొండితనం
ఘోరాల నిలయాల గోలీ ఆటలు
చూడు చూడు క్రీడలు
మతం ముద్దు బిడ్డల
గమ్మత్తుగొలుపు క్రీడలు

నగరాల్లో గ్రామాల్లో
వీధుల్లో...వాడల్లో
విచ్చల విడి క్రీడలు
మతం ముద్దు బిడ్డల
క్రీడలలో క్రీడలు
భారతమంతా క్రీడలు
అసమానపు క్రీడలు
మతం నేర్పిన కుల క్రీడలు

20-1-93

# దుబాయ్ లో తెలుగు మహిళ

ఆంధ్రాకన్నా...

దుబాయ్ మిన్నా...?
ఆంధ్రాలో యిమడలేక
అమాంతంగా సంపాదించేద్దామని
దూరపు కొండలు నునుపని
దుబాయ్ కెళ్ళిన
ఓ...నా స్వర్ణాంధ్ర తెలుగు పడుచుమల్లారా!
కన్నవాళ్ళ కష్టాలన్నీ
తుడిచేద్దామనీ...
పరిచారిక వృత్తికై
పరుగులెత్తావ్.
పట్టెడన్నం కరువై
పడుపు వృత్తిలో...
పట్టుబడి, బిక్కరించి
కేసులతో కోర్టులకు
జైళ్ళకు...శిక్షలకు
విధిగా బలౌతున్నమిమ్ము
ఏమని ఆదుకోవాలి?
పొదుపు సంఘం పిలుపు లేదా?
డ్వాక్రా సంఘం జాడ తెలీదా?
ఏ చేతి వృత్తైనా ఆదరణ వుందే?
పడుపు వృత్తిలో పట్టు పడ్డావా?
తెలుగు మహిళాతేజం దుబాయ్‌లో తాకట్టా?

---

గొడుగుచింత గోవిందయ్య

# స్వర్ణ భారతి

(ఏ దివిలో విరిసిన పారిజాతమో. పాట వరుస)

నాహృదిలో విరిసిన స్వర్ణభారతీ
మా ఇలలో నిలిచిన స్వతంత్ర భారతీ... //నా//
నిండుపున్నమిగ-మల్లెలందముగ
పల్లె పల్లెలో...విరియాలనీ...
ఎందరెందరో.... త్యాగధనులు అట
రక్త సింధువులు-రంగరించగా...
వీరులెందరో...పోరు చేయగా...
స్వర్ణ భారతిగా...అవతరించిన... //నా//

విశాల భారతి ఖ్యాతి నొందుతూ...
తరాల సంస్కృతి సుచరితలలో...
పుణ్యనదులతో... ధన్యభారతిగ
వాసిగాంచినది...నీవే...
సాగుభూమికై ...తాగు నీటికై
సాధన సమరపు-జనవాహినీ
కలుషిత నీటితో కడతేరి పోయిన
భావిభారత పౌరులు చూడు.... //నా//

ఎదుగుతున్న విజ్ఞానంలో
వికసిస్తున్న అరాచకత్వంలో
ఓ యువభారతీబాయి రోధన
ఆ వేదనాగ్ని స్వర్ణ భారతికి హారతే
మదమెక్కిన రక్షకుల లీలలలో...
పిండిన చనుబాలే పుణ్య భారతికి

## స్వర్ణ భారతికి క్షీరాభిషేకం

ఎదుగుతున్న నాగరికతలో
దిగజారుతున్న అనాగరికతే
స్వతంత్ర స్వర్ణభారతిలో
గిరిజన భారతీ బాయి ఘటన

కరువు కాటకము నాట్యమాడగా...
బరువు- బరువుగా బ్రతుకులీడ్చగా...
వెన్నుపోటుతో...రైతు కుమిలెనే
వైద్యవసతులే...పల్లెలు చేరక
దిగులు దిగులుగా బ్రతుకులీడ్వగా
మూఢనమ్మకపు ముసుగులతోనే
అరాచకాల రంగుల వలలో
విలవిలలాడే మనిషే
సాదామనిషి-సాదామనిషి-

(స్వర్ణోత్సవ సంబరాలపుడు పోలీసులు వివస్త్రను చేసి, చనుబాలు పిండి అవమానించిన గిరిజన స్త్రీ భారతీబాయి ఘటనకు కదలిపోయి...)

1999

# రైతన్న

ఇంతేనా రైతుల బతుకులు
బతుకు బరువు మోయలేక
బతుకు లేక బతుకు రాక
ఆత్మహత్యల నెంచుకొనే
రైతన్నల బతుకులు-

పంటలతో పొట్టనింప
పట్టుగ పొలంలో పైరేస్తే
సాగునీరు సగం రాదు
సగం 'ఎన్ను' నిక్కి చూస్తే

అకాల వృష్టితో కొంత
అనావృష్టితో యింకొంత
అసందర్భ అతివృష్టితో కొంత
పంట పంటంతా పల్లాకుల పాలే...

విత్తే విత్తనాల్లో...
పిచికారీ మందుల్లో
రసాయన ఎరువుల్లో
కల్తీ, కల్తీ, కల్తీ కల్తీ!

అసలు నకిలీల కల్తీ
అసలు నకిలీల మోసం లో
బతుకు ఆశ కై
బజారు కెళ్ళిన రైతు

కల్తీల మందుల్ని నమ్మి
పొలం మందుల సంగమంలో
క్రిమి కీటకాల సంహారం
జరగాల్సింది... జరూరుగా
రైతు పెళ్ళాం పిల్లల సంహారం
రైతుల సంహారం జరిగింది.

పతనమై పోయింది రైతన్న
బతుకు చాలించింది రైతన్న

పాలకుల అధికార్ల
నిర్లక్ష్యపు నీడల్లో
ప్రతివాడ రైతన్నా!
ప్రతి సెనగ రైతన్నా!
ప్రతి పత్తి రైతన్నా
బలి గాక తప్పదా?

5-3-98

# సదువు పాట

సదువులు సదివించ బూనరో...సదివినన్న..
సదువులు సదివించబూనరో...సదివినన్న.

సదువు నేర్పనువ్వులేవరో.... ఓ ..రన్నా!
సమతను అందించరారో.... ఓ... రన్నా!
మమతను నేర్పించరారో...మాయన్నా! ---

పల్లె పల్లె నువు తిరిగి- ప్రగతి మాట నువ్వు జెప్పి
బతుకు బరువు తగ్గించే-పద్ధతులను బోధజేసి
బతుకుమీద ఆశజూపి- బతుకును నేర్పించ నువ్వు-/సదువులు/

అక్షరాల రాశినంతా...నిరక్షరాలకందించి
అక్షర నిధి నందజేయరో ....ఓ రన్నా...
అక్షరాల తోడుగా లోకరీతి తెలిపేందుకు
చదువుల వెలుగులతో చీకట్లను తొలగించగ ---
సూరీడై సాగిరారో... లేత వెలుతురైనువ్వు లేవరో.../సదువులు/

కులాల తేడాలొద్దంటూ - అంటరాదు పొమ్మంటూ
కులాలలో రగడరేపి-వర్గాలుగ వేరుచేసే
అంటు జాడ్య పిచ్చగాళ్ళ-సంస్కరించి సమత నేర్పి
సమానతను సాటి చెప్ప-మమతను అందించనువ్వు-/సదువులు/

మారణ హోమం చేస్తు...మా మతం గాదు పొమ్మంటూ
మతపు ద్వేషాగ్నిలో సామాన్యుల కాల్చి చంపే...
మతం మంట రగులుతోంది పైపైకే ఎగురుతోంది
మానవతను మనిషికిచ్చే-సదువులు సదివించనువ్వు-/సదువులు/

బంజర్లను సాగుచేసి- ధాన్యరాశి పెంచేందుకు
ఉదాత్తమైన నీ సాయం రైతుకూలి కందించి
పంటలు పండించబూనరో...సదివినన్న...
ప్రగతిని అందించలేవరో ...సదివినన్న ---/సదువులు/

భూస్వాముల భూమి లాగి-రైతు కూలికిచ్చేందుకు
అడవి నేల సాగు చేయ-నడుంగట్టి నిలిచేందుకు
జనం తోడు నిలిచేందుకు- జనంతోడు వుండేందుకు
లేలేలే...సదివినన్నా... లేలేలే...సదివినన్నా...

15-2-92

# రాజకీయం హింస

రాజకీయం చేత హింసా?
హింసచేత రాజకీయమా?
రాజకీయం కొరకు హింసా?
హింస కొరకు రాజకీయమా?
రాజకీయము యొక్క హింసా?
హింసయొక్క రాజకీయమా?
రాజకీయమునూ, హింసయునూ
ఉభయ పదార్థ ప్రధానంబు
నేటి మన ప్రజాస్వామ్యంబు-
రాజకీయ హింసా సామ్రాట్టులు
రాజకీయ హింసా చక్రవర్తులు
రాజకీయ హింసాసార్వభౌములు
రాజకీయ రంగంలో రారాజులే?

# స్వర్ణాంధ్రవమా!

స్వర్ణాంధ్ర కై హైటెక్కు
స్వగృహంలో కరెంట్ కట్
ఇంటర్నెట్ పాలన అధికం
ఇంటి కరెంటు చార్జీ అత్యధికం-
కంప్యూటర్ ప్రతిభ తెలుగు 'వాడి' ప్రతిభే
క్లింటన్ దేశానికి-తెలుగు 'వాడి' తోడైంది.

ప్రపంచ బ్యాంకు గుప్పెట్లో
స్వర్ణాంధ్ర ప్రదేశ్ ముచ్చట్లు
కంప్యూటర్లతో ఉద్యోగాలకు స్వస్తి
నిరుద్యోగులకు మిగిలింది ముష్టి

ప్రపంచ బ్యాంకు నిర్దేశించే
స్వర్ణాంధ్రప్రదేశ్ సంబరాలు
ఆంధ్రరాష్ట్రావతరణానికి
పొట్టి శ్రీరాములది ప్రాణత్యాగం
స్వర్ణాంధ్రావతరణానికి
సంపూర్ణ చంద్ర గ్రహణం.
స్వర్ణాంధ్ర జన దౌర్భాగ్యం
టెక్నాలజీ-హైటెక్కుల్లో
జనజీవనం యాంత్రికం...

మూఢనమ్మకాల ముసుగులో
జనం కోలాటాల కోలాహలం
రసాయనాల-ఎలక్ట్రానిక్‌ల మోజులో
విషవాయువుల జతగా జీవనం

దేశాభివృద్ధికి రైతు వెన్నెముకే
రైతు మోటరుకు కరెంటు కట్టిక
కరెంటు చార్జీల హోరులో....
మోటరుకు లేదిక కదలిక

చెరువుల్లో దురాక్రమణ స్వైరవిహారం
చెరువుల్లో పాలకవర్గాల భవనాలు
చెరువులు దురాక్రమణకు నిలయాలు
చెరువులకు నకిలీలు యింకుడుగుంతలు

చెరువుకు నీళ్ళురాక పొలాలు బీడులు
బీడులతో వాడలు వాడలు వలసలు
వలసలతో నిరాహార ఆకలి చావులు
తొలి సంధ్యలో ...
గూళ్ళు విడిచి... కూనలిడిచి
ఆత్రంగా... కేకలతో...
లేచిపోయె పక్షులు
మన వాడల వలసలు
వలసలతో వాడలు బీడులు
వలసల బీడుల నడుమ జీవన కేకలు

# వ్యధల జీవనం

శరీరావయాలపై
పరోక్షరోగ ప్రభావం,
అంతు చిక్కని రోగ నిర్ధారణలో..
నివ్వెరబోతోంది వైద్యరంగం
అంతు తెలియని రోగరాపిడిలో
వ్యధల జన జీవనం.
ఐ.టి కంప్యూటర్ల అంకెల గారడీ
ప్రకృతి వైపరీత్యాల నిలపగలదా?
గారడీ విద్యలో ఘనులు పాలకులు
ప్రపంచ బ్యాంకు మరమనుషుల పాలకులు
అవాస్తవాల- అసత్యప్రకటనల దోస్తులు పాలకులు
వరద నీటిలో మునిగిన గ్రామాలకు
ఐ.టి. వలన ఒరిగిందేముంది?
పంట- ఆస్తి- ప్రాణనష్టం తప్ప...
ఆంధ్రాను 'సింగారించి' అమ్మేస్తున్నారు
ప్రజలు నిలదీస్తున్నారు
లాఠీచార్జీలు- అరెస్టులు, కాల్పులు జవాబైనాయి
నియంతలు, క్రిమినల్సుగా పాలకులు
వ్యధలగాధలతో జనజీవనం
అవినీతి వారసులకు నూకలు చెల్లుతున్నాయ్

1-9-2001





దేశాభివృద్ధికి రైతు
రైతు మోటరుకు
కరెంటు చార్జీల
మోటరుకు లేదిక

చెరువుల్లో దురాక్ర
చెరువుల్లో పాలకవ
చెరువులు దురాక్ర
చెరువులకు నకిలీలు

చెరువుకు నీళ్ళురాక
బీడులతో వాడలు
వలసలతో నిరాహార
తొలి సంధ్యలో ...
గూళ్ళు విడిచి... కూ
ఆత్రంగా... కేకలతో..
లేచిపోయె పక్షులు
మన వాడల వలసలు
వలసలతో వాడలు బీ
వలసల బీడుల నడు

మేము కాదు మాజవాన్లు కాదని
మన వీరజవాన్లపై బాంబులు వేసిండు
మన వీరజవాన్లపై కాల్పులు జేసిండు

సరి హద్దు దాటము-హద్దు మీరమని
భరత భూమిలో భాగం కోరుతు
క్లింటన్ తోనే రాజీకోరుతూ...
కార్గిల్ నాది, కాశ్మీరు నాదని
కొండకోనలే దాటే వచ్చిన
పాక్సేనను అంతు జూచుట
నవాజ్ గాడి నరములు దీయుట
భరత వీరుల దీక్షగ వుండాలీ-
నంగి-నంగిగా మెత్తగ నవాజు
వాజ్ పాయినీ మైత్రిగ రమ్మనె
ఆలింగనముతో చేతులుబిసికి
అణు బాంబులు వేస్తామ్ 'ఖేల్ఖే' అన్నాడు
మిలిటెంట్లను ముందుగ బంపీ
బంకర్లలోన భద్రం జేసీ...
మన రక్షణ దళముల చంపిండు
హద్దు మీరిన నవాజ్ గాడికి
హద్దుల్లోన నిలిపేటందుకు
బుద్ధొచ్చే రీతిలో ధ్వంసంజేసి
భరత వీరుల ప్రతిభను చూపాలి...

నక్క వినయముతో నవాజ్ గాడు
కుత్తుక కోసే కసాయి గాడై
క్షిపణులతోనే సిద్ధం అయినాడు
శాంతి సహనములు పక్కకు నెట్టి
దేశరక్షణకై ముందుకు నడవాలీ

# అవినీతికే హారతులు!?

అవినీతికి అంతం లేదు
అవినీతికి అవధులు లేవు
ఉద్యోగి జీతానికి టాక్స్
ఆదాచేసుకోవటానికి అవధులూ-

అవినీతికి అర్థం లేదు
అవినీతికి అడ్డే లేదు
నీతి నియమం కావాలంటూ
అవినీతిని తలంటుకొంటున్నారు దర్జాగా!
నిజాయితీ సభ్యులకు
నిలువ పీఠం లేదు
నిరంతరం సమస్యల అల్లిక
అవినీతి సాలీడు గూడులోకి
నిజాయితీ సభ్యుల నెట్టివేత.

గజాల్లా అవినీతిని మేసి
వాడ వీధి-నగరాల్లో
ఊరేగుతున్నారు-
వివిధ అవినీతి ఉత్సవాల్లో
అవినీతి ఉత్సవ విగ్రహాలుగా...
పల్లకీ మోత గాళ్ళు వాయిద్యగాళ్ళు
అవినీతిని అంతం జేయాల్సిన జనం
ఆ వేడుకలు దర్శిస్తూనే
అవినీతికి హారతులిస్తూ...
అవినీతినే పూజిస్తున్నారు-

బడుల్లో గుడుల్లో
అవినీతి స్వైరవిహారం
న్యాయ పీఠంలో అవినీతి నాట్యం

ఆడిట్‌లో అవినీతికే టిక్
అవినీతి నిరోధకంలో
అవినీతే భరత నాట్యం
నీతికి నిలువ నీడ జాడేలేదు

నిజాయితీ సింహాలై
గజాల కుంభస్థలాలను
పగులగొట్టి చీల్చాల్సి ఉంది
హారతుల్ని కాగడాల్ని చేసి
తగలెయ్యాల్సింది మనమే ... జనమే

# జడివాన

విరితేనియ జడివానలో
ఎదనిండుగ తడవాలని
సుధారాగ పరిమళాలు
వెల్లువలై సాగాలని
బాధల గాధల ఎదలో
సుధల తాకిడవ్వాలని
ఎద బరువే తరగాలని
మదిపరువం ఎదగాలని
పల్లవించే విపంచికై
సంధ్యా గీతి పలుకై
మునుముందుకు సాగ
సుగుణాల పరిమళాలు
సమానతా సరాగాలు
గ్రామ-పల్లె-వాడల
మురిపించి మై మరపించి
నిరంతరం మది చేరగ

23-12-98

# కవితాంజలి

కడుపున నన్నుంచుకొని
కష్టాలెన్నో బడసి
రెండురూపాయలకే
తెల్లవారు జామువనే
అడివెక్కి బోదకోసి
అలసటతో మోపులు మోసిన
అమ్మకు అంజలి
కవితాంజలి-హృదయాంజలి

వారపు సేద్యంలో
నిరంతర కష్టంలో
గూడలేసి....కపిలిదోలి
చెమటోర్చి-పొదుపుజేసి
బువ్వబెట్టి-సదువునేర్పిన
నాయినకు ...

కవితాంజలి-హృదయాంజలి

# విద్యార్థీ

గరుకులశాలలో చదివెడి విద్యార్థీ
ప్రగతికి మార్గం వున్నది లే లెమ్ము-
ప్రతిభను పొందే పిల్లలు మీరూ..
కృషియత్నం కొరకై రా! రా! రమ్ము
భావికాలపు చింతన చేయుమా
భావి పౌరుడవు నీవే నిలబడతావ్

ప్రగతి ప్రతిభలు-చెంతకు చేరగను
విద్యావిజయం-తోడుగ నీకుండు
కలిసి మెలసి జీవించే నేర్పుతో
ముందుకు సాగుము-విద్యాదశలోనా
అనురాగపు మమతలతో నిరతము
సమతా మమతలు నిలుపుట నీవంతు

9 వ వార్షికోత్సవం లో సభాప్రారంభగీతం : వంశీ- కనక రాజ్(విద్యార్థులు) మరియు శ్రీ మహేశ్వరయ్య (టీచర్) ఆలపించారు-

బండారుపల్లి (వరంగల్ జిల్లా)
1-10-91

# ఆధునికులం

ఆధునికులం
నాగరికులం
నవయువకులం
విమర్శకులం
గాయకులం
పాఠకులం
సమతా పాటకులం
అత్యాధునికులం
కుళ్ళి కంపుగున్న కులతత్వాల
కుప్పలు దోయడం
మున్సిపాలిటి గాడీల్తో
అడవుల్లో అగాధాల్లో
కుప్పల్ని కుమ్మరిస్తాం
వీధుల్ని, వీధుల్లోని మనుష్యుల్ని
మనుష్యుల్లోని కుల మురికి తత్వాన్ని
శుభ్రం చేయడమే
మా...విధులు

9-2-87

# అమ్మా-నాన్నలు

అనల్ప అభిమాన నిధులు
అనంత ఆధరాల బుధులు
అనంత ఆప్యాయతా గనులు
మనతలపుల దేవేరులు
మన అమ్మా నాన్నలు.
మనం మనం గా వున్నంతకాలం
మనం జనంలో కలసికదలినా
జనం మనలో కలసి కదలినా
ఆ జ్ఞాపకాల ఊపిరిని పీల్చుదాం
ఆ అనురాగాల స్పందనలే పొందుదాం
ఆ ఆప్యాయతలే పెంచి పంచుదాం.
సుందర దరహాస వాసులుగా
మును ముందుకే నడుద్దాం

# అనురాగాలు

(నన్ను దోచుకొందువటే ... మాదిరి)

నన్ను వలచి మలచినావు
చిన్నెల చిన్నారీ!
నామదిలో నిలిచినావు
నువ్వే సుమ రాశీ ---

నీ పలుకే ఒక వలపై
నీ పిలుపే ఒక మల్లుపై
అలరించెను నన్ను...
నీ పలుకు-పిలుపులన్నీ ---

ఎంతటి అభిమానమో...
అంతకన్న ఆదరణా ...
అనుక్షణం అన్ని...
నిను మరువనివ్వలేదు ---

నాహృదయ వీణ స్పర్శించి
సరి చేసి శృతి చేసి
సరిగమలే నిండా...
సరాగాలు నిలువా...
అలరించినావు...
అనురాగాలు కలిపి ---

కదలించినావు
నా ఎదలోన నీవు
పలికించినావు..
నీ వలపుతోడ నన్ను ---

# అలసిన జనం

అందుకో! అందుకో!
అభిమానాంధ్రుల
అంగీరస వత్సరమా!
అందుకో!స్వాగత సుమమాల!

నిన్నటి మీ ప్రజాపతికి
మేమివ్వలేదు వీడ్కోలు
మందు పాతర్ల పేలుళ్ళకు
ఎన్‌కౌంటర్ల కాల్పులకు
లాకప్పు కాల్చివేతలకు
పాపం! 'ప్రజాపతి' పరుగిడింది
కనిపించే ప్రతి కష్టజీవి
ఆకలికి కేకలేసే అభాగ్యుడు
భూస్వాముల రాపిడికి నలిగి నోడు
నక్సలైటుగా...తీవ్రవాదిగా
బలికాబడుతున్నాడు నేడు-

భారత సరిహద్దు
భారతదళ బందూకుకు
నిన్నటిదాకా గాలింపు చర్యలతో
నానా హింసలకు గురైన జనానికి
స్వేచ్ఛా రసాన్ని నీవందించి
సేదదీర్చగలవనీ...
ఆశతో స్వాగత సుమమాలతో
ఎదురు చూస్తున్నారు
ఆశతో అలసిన జనం-

1-4-92

# ఓ... కవితా!

కవితా ఓ... కవితా!
కమనీయ కవితా!
తరచి తత్వాల జూపే కవితా!
విషయం విశ్లేషించే కవితా!
కవితా! ఓ...కవితా!

సనాతన కబంధ హస్తాల్లో
సంకుచిత తత్వాల్లో
ఒకనాడు బందీవి నీవు
సామాన్యుల చెంతకు నీవెళితే
మలినమైనదంటూ
ద్వేషించారు నిన్ను
కుతంత్రాల కుళ్ళులో పడేశారు

నిను సామాన్యులకే అర్పించాలని
నీలో సామాజికతే నిండాలని
ఎందరెందరో సాహసించారు
వెలికిదీసి కడిగేశారు నిన్ను

పూర్ణమ్మలో ఆచారాలను కూల్చావు
లవణరాజు కలలో కుల అంతరాలను తుంచావు
కష్టజీవిలో బతుకు బరువు చూపావు
పేదలలో ... పేదబతుకుల్లో ...
అశ్రువులే నిండిన కుండలు చూపావు
బిక్షు వర్షీయసిలో
ఆకలితో ఈగలతో

ఆరిన కుంపటిలాకూచున్న
ముసలవ్వను చూపావు
పేదల చెంతనే చేరావు

చేతివృత్తుల సందడిలో
నైపుణ్యతను - నాణ్యతను
రమ్యతను - రమణీయతను
వాడితనాన్ని - వేడితనాన్ని
ఏకాగ్రతను - సూక్ష్మగ్రతను
దర్శించి - దర్శింపజేస్తూ...
చెమటే కవితై
కవితే చెమటై
జీవనప్రగతికి నిలచిన కవితా!
నా కవితా...!

17-1-2001

# గమనం

పొగవుతున్న భావాలను
పదిల పరిచేందుకు
పెన్ను కాగితం తీసుకున్నా
వసంతాన్ని కౌగిట చేర్చి
చిగురాకుల సందుల్లో చిందులేస్తూ...
కానరాని కోకిలమ్మ
సరాగాలు పాడే తీరును
రాద్దామనుకున్నా

హరిద్వార్‌లో కుంభమేళాకేగి
గంగలో శవాలై తేలిన భక్తజనాల గూర్చి
రాయాలని తోచింది
ఆధ్యాత్మిక భావతరంగాలు
తిరుమల గిరుల్లో ధ్వనిస్తుంటే
దర్శనానికెళ్ళి దోపిడికి గురైన జనం
ప్రయాణ ప్రమాదంలో
శవాలైన జనాన్ని గూర్చి...

అలసి అవ్వాచారి కోన చెంత
సేదతీరి ప్రశాంతంగావుంటే
కబుర్లతో చేరువైన వాడు
అమాంతంగా ఆకోనలోకి
తోసి బ్యాగులాగేసి పరుగెడితే
అనంతమైన లోయలో... ఆర్తనాదం
నెమలి కంట్లో నీళ్ళు కారితే

వేటగాడికి ముద్దు గాదు గదా!
భీకర శబ్దాల నిలయంలో
రక్షణకై కేకలు కేకలు
ఆధ్యాత్మిక భావ తరంగాల సవ్వడిలో
ఆర్తనాద చావుబతుకుల కేకల సవ్వడి

త్రివేణీ సంగమ కుంభమేళాలో
రాద్ధాంతంగా మిగిలిపోయిన
రామజన్మ భూమికి
రూపకల్పన సాగుతున్నదని
పునాదికి పూజా ముహూర్తం
నిర్ధేశించారని రాయనా?

పంచలోహాల విగ్రహాలు దొంగిలించారని
బ్రహ్మయ్యను లోపలేసి బాదితే
కాదన్నా లేదన్నా లాఠీలు నాట్యం చేస్తే
అనుమాన నేరం అవమానంగాఎంచి
బ్రహ్మయ్య కుటుంబం విషం తాగింది
విగ్రహాల దొంగలు కుదిట్లో తేలులా
నిగ్రహంగానే నిలబడ్డారని రాయానా?

మనిషిలో మార్పు రావాలి
మానవత మనిషిలో నిలయం కావాలి
సమత మనిషికి గమనం కావాలి

11-1-2001

# మార్పు

అన్నిటా అంతటా మార్పు
మార్పే నిత్యవసంతం
పుట్టుటలో గిట్టుటలో
ఎదుగుటలో బ్రతుకుటలో
మనిషిలో మనీషిలో
మనసులో మమతలో
చెట్టులో పుట్టలో
కట్టులో బొట్టులో
అన్నిటా అంతటా మార్పు
ఒడిలో...మడిలో
బడిలో...గుడిలో
భక్తిలో...రక్తిలో
ముక్తిలో...భుక్తిలో
పలుకులో...పాటలో
పనిలో...పంటలో
వేషంలో...రోషంలో
కోపంలో...ద్వేషంలో
సూర్యునిలో-చంద్రుడిలో
గాలిలో-వానలో
అధికారంలో- ఆరాధనలో
అనురాగంలో- ఆత్మీయతలో
చదువులో-సంస్కారంలో
సాహిత్యంలో-సంగీతంలో
ప్రతి అంశమూ మార్పే
ప్రతి క్షణమూ మార్పే
ప్రకృతి అంతా మార్పు
మార్పుకు నోచుకోనిది
ఉన్నతనం-లేనితనం
కులతత్వం-కుతంత్రం
మోరకించి మారాం చేస్తున్నాయ్.

28-10-79

# నాయకత్వం

భగ్నమైన హృదయం
పవిత్ర ప్రేమకు వ్యర్థం
స్వేచ్ఛలేని జీవితం
ప్రజాసామ్యంలో వ్యర్థం
ప్రేమించలేనివాడు
ప్రజాసేవ చేయనివాడు
ప్రేమకు నాయకుడిగా
పేరు పొందుట వ్యర్థం
పొగడ్తలొందుట వ్యర్థం
ఓట్ల కోసం నిత్యం
వీధులు తిరగడం సత్యం
ప్రేమ కోసం నిత్యం
పరుగులెడుట సత్యం
పదవిలో తిరగడం
నాయకుడికి లక్ష్యం
అంతో యింతో ప్రజలకు
సేవ చేయుట ముఖ్యం
ప్రేమించబడడం కష్టం
ప్రేమించ బడిన వాడు
ఓట్లతో గద్దెక్కిన వాడు
మరువరాదు ప్రేమతత్వం
మరువరాదు నాయకత్వం
ప్రేమకు వర్ణ పట్టింపులు
ప్రజాసేవకు బంధు పట్టింపులు
ప్రాకనీకు- ప్రేమ తత్వంలో
ప్రాకనీకు-నాయకత్వంలో

అందరి శ్రేయస్సు కోసం
తపన చెందాలి నిత్యం
ఉభయ నాయకత్వం---
అవినీతి మయం కారాదు
ఏ నాయకత్వం

1979

# సాదామనిషి

ఎన్నాళ్ళు బతకాలిలా?
మరెన్నాళ్ళు నిలవాలిలా?
జీవితాంతం యిదేనా?
జీవితాంతం యింతేనా?
చాలీ చాలని సుఖాలతో
నిలిచి నిలవని సంపదలతో
ఎలా జీవితంగడపాలి?
ఎలా గమ్యం చేరాలి?
నిరంతరం నీడలేక
తృప్తిలేని పూటలతో
తొలి మెరుగులు దిద్దలేక
తుపానులోని నావలాగ
పట్టాలు తప్పిన రైలులాగ
నూనెలేని ప్రమిదలాగ
ఎన్నాళ్ళు నిలవాలిలా?

# మానవతా!

మా...నవతలో కానరాని
ఓ...మానవతా!
అణగి మణిగి దాగున్నావా?
మా నవతా మనుషుల్లో!
అసమానతా రాపిడిలో
పొడిగా రాలిపోతున్న
సాదా మనిషి కూడా మానవుడే
తేనె టీగంత నిమగ్నత
మనిషి మానవతతో వుండాలి
వేగంతో... ఆలోచనలు
అనాలోచితంగా పరుగులు
కలను కావ్యాలుగ మలచి
శిలను శిల్పంగ మలచి
చంద్రలోకంలో నడచి
సంద్రం లోతు తరచి
అణుశక్తికి ఆకారమిచ్చి
ఫణికాటులా ప్రమాదిగాజేసి
మతాచారాల రాపిడికి
కులాచారాల తాకిడికి
మానవత మౌనం దాల్చింది
మూర్ఖత్వపు నమ్మకాల నమ్మి
సమతకు తిలోదకాలిస్తున్నారు
పరివర్తన లేని ప్రవర్తనలో
మానవతకు మసిబూసుకొంటున్నారు.

# గిరిజనమా!

ఓ...నా...
గిరిజన జనమా!
ఏడాదికో బిడ్డను
నిర్విరామంగా కనడమేందిరో!
నియంత్రణ తెల్సుకోరాదరో!
బిడ్డల్ని కన్నోడివి
బిడ్డల్ని పైసలకమ్ముడేందిరో
బిడ్డల్ని సదివించరాదురో
బతుకు బరువు తగ్గించుకోరాదురో
బిడ్డల్ని చాకిరీ చేసేటోళ్ళుగా...
బిడ్డల్ని ఉంపుడుగత్తెలుగా
విదేశాలకు పంపేందుకేగా
మీబిడ్డల్ని కనేస్తున్నారు
దత్తత ముసుగులో ఎగుమతి
కానీ...మీ బిడ్డల్ని
పరోక్షంగా ఎగుమతికిస్తున్నావ్
బిడ్డల్ని అమ్ముకొని తినే
నీ కూడు-కూడు కాదురో బిడ్డా!
కూటికి-గుడ్డకు లేనపుడు
కనడం మానెయ్యరాదురో!
నియంత్రణా జనాగ్ని గుండంలో
మీరోకర్ర తుండేయరాదరో
మీ బిడ్డల్ని కొన్న సావిత్రమ్మలు
అడ్డు ఆపులేకుండా దోస్తున్నారు
మీ బిడ్డల్ని అమ్ముకొన్న మీరేమో
మద్యం మత్తుల్లో మజాగా మునిగి
కూడు-గుడ్డలకే సరిపెట్టుకున్నారు

ఏకలవ్యుడే వుంటే
ఏడ్వకుండుంటాడా?
మీ నరాల్ని తెగేసుంటాడు
మీబొటన ఏలుల్ని తేగేసుంటాడు
సమ్మక్క, సారక్కలేవుంటే
సాహసించకుంటరా!
మంత్రసానులై గర్భసంచినే
చిదిమికోసి తీసేసుంటారు.
కొమరంభీమ్ వుండివుంటే
కోపానికి కొదవుండునా?
బిడ్డల్ని అమ్ముకోవడమంటే
ఎంగిలాకులు తుడిచి మడిచి
విసిరేయడమనుకున్నారా!
ఇప్పసారా-నాటుసారా
ఈతకల్లు-తాటికల్లు
మత్తుల్లో-మజాల్లో
ముక్కుదాక-మునిగిన
ఓ... గిరిజన జనమా!
ఏడాదికో బిడ్డను కనడం
ఇకనైనా మానండి
ఇద్దరితో చాలనండి
గిరుల చెంతనే వుంటూ
గిరుల నేల సాగు చేస్తూ...
సిరులు పండించేస్తూ
గిరుల పంట సేకరిస్తూ
సమాజాని కందించె
గిరిజనమా! గిరులుదిగి
మీ ప్రగతికై నడవండి
సమాజ ప్రగతికై నిలవండి

# దత్తతలో శైశవం

ఎడతెరిపి లేకుండా
ఏడాదికో బిడ్డను
కుటుంబ నియంత్రణకు
ఏ మాత్రం తావు లేకుండా
విరామమెరుగని గిరిజనులు
బిడ్డల్ని అదేపనిగా కనేస్తూ..
బతుకు బరువై బతకలేక
కన్న బిడ్డల్ని వందలకో-వేలకో
అమ్మడానికి సిద్ధమైతే
దత్తత ముసుగేసుకొన్న
సావిత్రమ్మలు బిడ్డల్ని కొని
అనాథ-వీధి బాలల ఉద్ధరణే
జీవిత లక్ష్యంగా చాటుకొనే
అభినవ సావిత్రమ్మలు
అమ్మాయిల్ని అమ్మేస్తూ
వేలు లక్షలు దోస్తూ
రాజధాని నగరంలో, నగర
పొలిమేరల్లో విహారం

తండాల్లో, వాడల్లో గ్రామాల్లో
ప్రగతికై ప్రజాహక్కులకై
సామాజిక న్యాయానికి
నిరంతరం పనిచేసే
సమతా ప్రగతి వాదుల్ని
ఎన్‌కౌంటర్ల పేర కాల్చేస్తున్నాం.

వందలాది పసికూనల్ని
చిన్నారుల్ని అమ్ముకు తినే
సావిత్రమ్మను యింకా ఎందుకో
కాల్చలేకున్నాం

విచారణలు-వినోదాల్లా
కమిటీలు-కవ్వింపుల్లా
కొనసాగుతునే వున్నాయి
పసికందుల, చిన్నారుల, కూనల
ప్రశాంతతకైనా సావిత్రమ్మను
నిలువునా కాల్చరాదా?

9-5-2001

# తాకట్టు పెట్టకండి

టెక్నాలజీ కసరత్తుల్లో
ప్రవేటికరణ ముసుగుల్లో
విదేశీయుల నాహ్వానించి
ఈ దేశాన్ని తాకట్టు పెట్టకండి!

కాశ్మీరం తమదేనని
పొంచివుంది పాకిస్తాన్
బంగ్లా దేశీయులూ
భారత సరిహద్దుకై
బరితెగి వస్తున్నారు
భరతభూమి వనరులకై
తరాలుగ విదేశీయుల వేట
చరిత్ర చెబుతున్నా...
విదేశీయులకై మనం
తెగ ఎగబడడమెందుకు?

పారిశ్రామిక వేత్తలు మనకు
కొదవలేదు గొడ్డుపోలేదు
మన పారిశ్రామిక నిపుణులే
సామాజిక న్యాయానికి
దోహదం చేస్తూనే వున్నారు
కొట్లాది రూపాయలు
టర్నోవరు చేస్తున్న
పారిశ్రామిక వేత్తలు
దండిగా ...మెండు గా వుంటే
నేలను నీరును పాలకులు

విదేశీయులకు ధారాదత్తం చేస్తూ
స్వదేశీయులకు తప్పుడు ప్రచార ప్రసార
ప్రగతి ముసుగులు తొడుగుతున్నారు
స్వార్థంతో తమ మనుగడ కోసం
ఎన్నెన్నోబూటకపు ప్రకటనల సందడి

మనలో పెట్టుబడిదారులు లేరా!
అన్వేషించి... ఆహ్వానించండి
స్వాగతం పలుకుదాం

10-5-2001

# విషయసూచిక